ప్రథమ ముద్రణ : జులై 2003

ప్రతులు : 1000

వెల : కవితా సుదర్శనం } రెండు పుస్తకాలు కలిపి
అంతరంగ మథనం } రూ. 60/-

పబ్లిషర్ : టి. నాగేంద్ర కుమార్

ప్రతులకు : టి. నాగేంద్ర కుమార్
ఫ్లాట్ నెంబర్: 5
రుక్మిణి అపార్ట్‌మెంట్స్
యూసఫ్‌గూడ చెక్‌పోస్ట్,
హైదరాబాద్ - 500 045



ముద్రణ : శ్రీ సాయి అమృత ఆఫ్‌సెట్ ప్రింటర్స్
కమలానగర్
అనంతపురం.
ఫోన్: 222095

# కృతజ్ఞతలు

నేను నా భావాలను కాగితం మీద పెట్టడానికి మొట్టమొదటి ప్రేరేపకుడైన మేకప్ మేన్ (బాబాయి) రాజగోపాల్ గారికి-

నా రచనలు కొన్నింటిని ప్రచురించిన ఆంధ్రపత్రిక, పల్లకి, ఆంధ్రభూమి (వీక్లీ) తెలుగు గడ్డ తదితర పత్రికలకు నా కృతజ్ఞతలు. వారందరి సౌజన్యంతో కవితా సుదర్శనం. అంతరంగ మథనం రూపుదిద్దుకొన్నాయి.

ఈ పుస్తకాలను చక్కగా ముద్రించిన శ్రీ సాయి అమృత ఆఫ్‌సెట్ ప్రింటర్స్ జి. రమేష్ గారికి కృతజ్ఞత్ని

-రంగనాథ్

# కృతజ్ఞతాభి వందనాలు

నాకు సాహితీ గురువర్యులు ఆచార్య తిరుమలగారు. నా పుస్తకాలకు ముందుమాట వ్రాయమని నేను వారిని కోరగా, వారు సంపూర్ణంగా వాటిని చదివి, తప్పులు సరిదిద్ది, ఉచితానుచితాలను విశదపరిచి, నన్నాశీర్వదించి నా పుస్తక ద్వయానికి "కవితా సుదర్శనం", "అంతరంగ మథనం" అని పేర్లు పెట్టారు. నేను పెట్టిన పేర్లే నీ రచనల పట్ల నా అభిప్రాయాలు, వేరుగా ముందుమాటెందుకు? అన్నారు చిరునవ్వుతో. నన్ను వెన్నుతట్టి నిలబెట్టిన కవికౌస్తుభునికి శతకోటి వందనాలు.

- రంగనాథ్



నిత్యకృత్యం నాకు, చైతన్య నామ స్మరణం-

నా హృదయం, చైతన్యమయం-

నేను వసించే గృహం, చైతన్య నిలయం-

నా జీవిత గమనం, చైతన్య సహితం-

చైతన్య నామ ధేయం, నా అర్ధాంగి అదృష్టం-

చైతన్యతో - చైతన్యంతో-జీవించడం నాకోవరం.

కవితా సుదర్శనం నేనామెకు అర్పిస్తున్న

నా అక్షర భాగ్యం! అంతకు మించి ఋణనమస్కారం!

-రంగనాథ్

ఈ ప్రకృతిలో -

నెలరాజు వెన్నెలలు-
తారకల మిలమిలలు-
చిరుగాలి గానాలు-
ఆహ్లాదమందించు లేబచ్చిక తీరాలు-
పురివిరిసి అలరించు మయూరాల నాట్యాలు-
వన్నె చిన్నెల విహంగాలు-
వన్యజీవన కళాచిత్ర విచిత్రాలు-
అనంతరూప వర్ణాల జలచరాలు-
కన్నుల విందుగా కోటి వన్నెల పుష్పాలు-
మనసు మత్తెక్కించు సుగంధ పరిమళాలు-
అందాలు-అందాలు-అనురాగ బంధాలు.
కానీ - ఈ సంఘంలో-
ఎటు చూసినా ఆవేదన-
న్యాయంపై తర్జన భర్జన-
తెలుసుకోవాలనే తపన-
హృదయంలో ఘనాఘన ఘర్జన.

పేరుకి మనుష్యులమై పేరుకు పోతున్నాం-
స్వార్థపు ఊబిలో కూరుకు పోతున్నాం-
మనల్ని మనమే మింగేస్తున్నాం-
మనిషిని చూస్తే భయపడుతున్నాం-
మనం మనుషులమని మరిచి పోతున్నాం.

న్యాయమైన బ్రతుకు కోసం-
బ్రతికించే న్యాయం కోసం-
ఆశగా చూడ్డం మానేద్దాం-
అభ్యుదయమేమిటో ఆలోచిద్దాం.

-రంగనాథ్

| సూచిక | | పేజీ నెంబర్ |
|---|---|---|
|  |

**సూచిక** **పేజీ నెంబర్**

# ప్రార్థన

జయ జయ జయ
జయ భారతి జయహో
వైదిక జ్ఞాన ప్రదాతా
సంగీత శిల్ప సాహిత్య భాసితా
సర్వకళా సంశోభితా
హిమనగ కిరీట ధారిణీ మాతా
అక్షయ గంగా సంయుతా
బోధిత సంస్కృతి నియమం
మత సంయమనమె సతతం
ధ్యేయం సాంఘిక న్యాయం
జయ జయ మంగళదాయిని జయహో
శాశ్వత భాగ్య పరీతా
జయహో జయహో జయహో
జయ జయ జయ జయహో

# విజయీభవ

విజయీభవ ! విజయీభవ !
జయ జయ జయ - విజయీభవ !

జయ భారతి ప్రఖ్యాతికి-
సమజీవన యజ్ఞానికి-
విజయీభవ! విజయీభవ!
జయ జయ జయ - విజయీభవ!

నవజాతికి పౌరశక్తి
నైవేద్యం కావాలి-
నరజాతికి నరనరాన
చైతన్యం రావాలి-
మనుగడకే మసిబూసిన
యీ చీకటి తొలగాలి-
ప్రతి మనిషి మన ప్రగతికి
కరదీపం కావాలి-

స్వార్థానికి - సౌఖ్యానికి
అహంకారపు మైజానికి-
మరణ భీతి హృదయానికి
సమాప్తి - పరిసమాప్తి!

మన జ్ఞానం - మన ధ్యానం-
మన రక్తం - మన ప్రాణం

జయభారతి ప్రఖ్యాతికి
బహుమానం - బహుమానం.
సమజీవన యజ్ఞానికి
బలిదానం - బలిదానం.

# కవితోదయం

ఆలోచన - అనుభూతి కలిస్తే-
మరో ఊపిరి కదలిక-
భావావేశంలో పురిటి నొప్పులు-
భాషా భాగాలతో - కవితారూపం-

అది హృదయాలు **క**దిలించే నవ్వుల పసికందు-
మనస్సులు **వి**కసింపజేసే-వెన్నెల పొందు-
మున్ముందు **త**రాలకు - వెలుగుల విందు-

అది క్రాంతికి సూర్యకిరణం-
శాంతికి చంద్రకిరణం-
దేశ జాగృతికి ఆశాకిరణం-
దివ్య సంస్కృతికి శిరోభరణం.

# ఓ యువకవీ !

కొత్తగా కలం గొన్న
ఉద్వేగపు యువ కవీ-
కవితంటే ఏదోయ్ ?

సంఘం ఒక కవ్వంగా
హృదయాన్ని చిలకగా
ఉద్భవించే నవనీతం-
కవిత అని తెలుసుకో-

కళ్లున్న గుడ్డివాళ్ల
కంటి పొరలు కోయగల కత్తిరా-కలం-
పెద్దరికం పేరుతో
దోచుకునే అన్నలకు - బల్లెంరా - కలం-
అజ్ఞానపు చీకట్లో
తారాడే తమ్ములకు - దివిటీరా-కలం-
కుల మతాల కుళ్లుతున్న
కుబ్జితపు మనస్సులకు - మంచిగంధం - కలం

ఓ యువకవీ !
గంజాయి గళాలకు నీ కవిత 'తులసి' కావాలి-
మానవత్వం ఊపిరిగా 'నీగుండె' ఆడాలి-
మమతల పరిమళాలు వెదజల్లే గోళంగా
కలకాలం భూగోళం-నీ కలం కొసన తిరగాలి.

# తేడా

కోరిన పైకం పారేస్తే - తనకు కోరిక లేకున్నా-
తనను కోరిన వాడి కోర్కెలు తీర్చేది వేశ్య.
అలాంటి వేశ్యాలోకంలో-ఆ జిల్లాకే అందగత్తెగా-
ఆ సాంప్రదాయానికి విరుద్ధంగా-వెలుగుతోంది ఒక వేశ్య
ఆమె సౌందర్యాస్వాదనకు వేంచేశారిద్దరు పురుషులు.

వేశ్య : 'రోజుకొక్కరే' - ఆమె నిబంధన.
'నేనా! అతనా!' వారి ఆందోళన.
వేశ్య : చందన సుగంధాల సుకుమారా! నీవెవరివి?
తె. కవి : నీ పొందుకై పరితపించే కవిని-తెలుగు ప్రబంధ కవిని.
వేశ్య : అత్తరు పరిమళాల ఆసామీ! నీవెవరివి?
ఉ. కవి : నీ ప్రేమకై పరితపించే కవిని - ఉర్దూ కవిని.
వేశ్య : తమకెందుకింత పరితాపము? తెలుగు కవీంద్రా!
కవితావేశం పొంగింది కవిలో-
భాషా పటిమ పొర్లింది తృటిలో-

తె. కవి : భామినీ! నీ కౌగిలి స్వర్గపులోగిలి!

అని ప్రారంభించి, - ఆ కవి ఆశువుగ

ఆమె అంగాంగ వర్ణనము నద్భుతముగ చేసి,

తె. కవి : నీ కౌగిలిలో కరిగిపోవాలని పరుగెత్తుకొచ్చాను-

కౌగిట బంధించు నన్ను

సుఖముల బాధించు నన్ను

తెలుగుకవి వర్ణనలకు వేశ్య తనువు పులకరించింది.

వేశ్య : తమరి తమకమేమి? ఉర్దూ కవి గారు!

ఉ. కవి: భాగ్యవతీ! నీ కౌగిలి స్వర్గపు వాకిలని విన్నాను-

బ్రతుకుపై వేసారి మరణంపై మనసు పడిన నన్ను

కరుణతో నీ కౌగిట అరక్షణం ఆదరించు-

నా ఊపిరి దీపమై నీకు హారతిచ్చేను-

నా ఆత్మ నీదయతో స్వర్గమే చేరేను.

# భాషాంతరం

అమెరికాలో కుక్కలు - బుసకొట్టవు-
అర్జంటైనాలో పాములు - మొరగవు-
ఇండియాలో పులులు - ఘీంకరించవు-
ఆఫ్రికాలో ఏనుగులు - గాండ్రించవు-
ఏ దేశంలో ఏ జంతువు, ఏ పక్షి పుట్టినా
ఆ జాతికంతా ఒకే భాష - ఒకే ఘోష.
మరిమనకో ?
మనం రొష్టుందాటి వెళ్లామంటే,
మన మాట వాళ్ల కు తెలీదు-
వాళ్ల మాట మనకు తెలీదు-
ఎందుకు?
ప్రకృతి సృజించిన భాష జంతువులది-
మనం సృష్టించుకొన్న భాష మనది-
అది సహజనాదం-
ఇది స్వార్థవాదం-

# పుష్పబాలలు

పుష్ప విలాపం చదివాను-
సానుభూతితో విలపించాను-
కవి హృదయం కనుగొన్నాను-
ఎదలో చేతులు జోడించాను.

అంతటితో ఆగలేక వెంటనే కదిలాను-
పూల భాష వినడానికి పూదోట చేరాను-
రకరకాల మొక్కలు, రంగు రంగుల పువ్వులు,
సువాసనల జల్లులు స్వాగతం పలికాయి.

ప్రతి మొక్కనూ, పువ్వు పువ్వునూ-
ప్రతి కొమ్మనూ, రెమ్మ రెమ్మనూ-
విడువకుండ - మరువకుండ
పరికించి చూశాను - పలకరించాను.

చిరిగిన బట్టలతో, యెండిన డొక్కలతో
పదిమంది పసివాళ్లు - ఆ తోటలో పనివాళ్లు -
వింతగా నన్నుచూసి పకపకా నవ్వారు.

ఎండమాట తిండిమాట పట్టించుకోకుండ-
నిరుత్సాహ పడకుండ-పట్టువిడిచి పెట్టకుండ-
పూల చెక్కిళ్లు నిమిరాను - బుగ్గలు ముద్దాడాను-
ఆకుల్ని అర్థించాను - వేరుల్ని వేడుకొన్నాను.

ఎన్నెన్ని విధాల ప్రాధేయపడినా,
మాటొక్కటైనా వినలేక పోయాను.
కరుణశ్రీ కవిగారికి వినిపించిన గాత్రాలు
నా కర్ణాలకు సోకనందుకెంతగానో శోకించాను.

వాటి భాష వినగలిగే హృదయం లేదనుకొని,
నన్ను నేను తిట్టుకొంటూ, దిగాలుగ నడుచుకొంటూ,
అస్తమించే సూర్యుడిలో నన్నునేను చూసుకొంటూ
దుఃఖంతో, వేదనతో కదిలి వెళ్లి పోతుంటే.....

తోటలోని ప(ని)సివాళ్లు
ఇళ్ల కువెళ్తూ యెదురయ్యారు.
వాళ్ల చేతుల్లో కూలి డబ్బులు-
వాళ్ల ముఖాల్లో ఆనంద రేఖలు-

కడుపునిండా తినవచ్చునో-
యింట్లో వారికి పెట్టవచ్చునో-
పరుగెత్తే ఆ పసి వదనాలు
ఆ క్షణంలో వికసించిన పుష్పాలు.

మనసారా పువ్వులతో మాట్లాడ వెళ్లాను-
కళ్లారా పిల్లలలో పువ్వుల్ని చూశాను.

# పువ్వుపేరు

కలకండ తొట్టిలో,
మంచి గంధం మట్టి వేసి,
నిండు పున్నమినాటి వెలుగుల
వెండి వెన్నెల మొక్కనాటి,
వెన్న ముద్దల యెరువు వేసి,
పన్నీటిజల్లుల వానలో,
నవరత్నకాంతుల యెండలో,
ఉంచి - పెంచి - పోషిస్తే-
దానికి పూచే పువ్వు పేరేమి ?

"ప్రేయసి చిరునవ్వు"గాక వేరేమి ?
అంటే అది కవిత్వం-
"పసిపాప బోసినవ్వు"
అంటే, అది కవిత్వానికి అలంకారం-
"విశ్వప్రేమ" గాక వేరేమి ?
అంటే, అది మానవతకు సత్కారం.

# నవరత్నాలు - నారీరత్నం

అది - కెంపా? చెక్కిలిపై సిగ్గుల సొంపా!

అది - ముత్యమా? మనసున మన్మథ నృత్యమా!

అది - పగడమా? కనుసైగల జగడమా!

అది - పచ్చా? లోలోపలి ఇచ్ఛా!

అది - నీలమా? కొంటె చూపుల గాలమా!

అది - పుష్యరాగమా? పురివిప్పిన అనురాగమా!

అది - గోమేధికమా? ప్రేమాధికమా!

అది - వజ్రమా? దరహాసపు కాంతి పుంజమా!

అది - వైఢూర్యమా? ఒలకబోసిన వయ్యారమా!

ఇంతకూ నీవసలు-

నవరత్నపుటుంగరానివా?

నవకాంతుల నారీ రత్నానివా!

# ఆదర్శ దాంపత్యం

మొగుణ్ణి తన చుట్టూ తెగ తిప్పుకొంటుందని-
ఆదిలో అపవాదు అమ్మమీద.
నాన్న చుట్టూ అమ్మే తిరుగుతూ వుంటుందని-
తెలుసుకొన్నారందరూ తర్వాత్తర్వాత.

అమ్మకు సవతులేడుగురున్నా
ప్రేమానురాగాలు-నాన్నకమ్మమీదే యెక్కువ.
నీలం, పచ్చపట్టు చీరలు-
మెరిసే వెండి ఆభరణాలు-
రంగు రంగుల రవికెలు-
కోటి వన్నెల పూలు
కొప్పులో తురిమి-
అనంత సంతానం
అమ్మకొక్కదానికే
ప్రసాదించాడు నాన్న
విలాసంగా అమ్మ-విశ్వ విహారం చేస్తూవుంటే,
అష్టభార్యల మధ్య అందంగా నిలబడి-
మురిసిపోతుంటాడు-తెగ మెరిసిపోతుంటాడు నాన్న.
మానాన్న సూరీడు-మా అమ్మ భూమాత-
సవతులితర గ్రహాలు-సంతానం సకల జీవరాసులు.

# భోగి - దీపావళి

దేవుడా !
ఏడాది పొడవునా, ఏదో ఒక పండగ
జరుపుకొంటుంటాము-నీ పేరున మేము-
అందులో ముఖ్యంగా భోగి, దీపావళి.
పిండివంటలు మామూలే ప్రతి పండక్కి-
వంటలే కాదు - మంటలూ వున్నాయి వీటికి-
చెత్తా చెదారం పోగేసి కాల్చేస్తే
శుభ్రపడిపోతాయి వూళ్లన్నీ చక్కగా.
మందుగుండు సామాగ్రిని, పోటీపడి కాలిస్తే
దుష్టదోమలపీడ విరగడైపోతుంది.
ఈ రీతిగా భోగికి దీపావళికి కోటి దండాలు.

కానీ,
దేశానికే నిప్పంటించి,
అది తగలడుతుంటే చూసి,
భోగులు గంతులేసే రోజు-దేశానికి-
విజ్ఞాన ఫలితాలు-
అజ్ఞాన కారణాన-
దేశాలపై జారి-
అణ్వస్త్ర దీపావళి-అనిపించే రోజు-ప్రపంచానికి
రాకుండా చూడవయ్యా! దివ్యమైన దేవుడా!

# బందోబస్తు

తాళాలు, తలుపులు, గోడలు
కోటకున్నంత - గుడికెందుకంట?
దేవుడి ఒళ్లంతా బంగారమంట-
దేశంలో ప్రతి చోట దొంగలంట-
దేవుణ్ణి కూడ దోచుకుంటారంట-
అందుకే గుడికంత బందోబస్తంట-

నిజంగా అందుకేనా, లేక
ఒంటి మీది నగల్తో-
గుడిలోని దేవుడే-
గోడ దూకి పోతాడనా?
ఏదైనా కావచ్చు-
'కాలం' అలాంటిది మరి!

# వరదలో వరదుడు

అద్దరాతిరేల నిద్దరోతుంటే-
వరదొచ్చి ముంచింది-
మావూరు మునిగింది-
మా గుండె పగిలింది.

ఎతికెతికి సూసినా-యెటువేపు సూసినా-
నల్లగా సీకటేను-సల్లగా నీళ్లేను.
పెళ్లామూ కనరాదు-పిల్లాడూ కనరాడు-
ముసలాళ్లూ కనరారు-నేనేమి సేసేది?
పేర్లెట్టి పిలిశాను - అరిశాను అరిశాను-
గొంతు సించుకున్నాను-గుండె బాదుకున్నాను.
పేనాలకోసం తెల్లార్లూ నేను
సెట్టు కొమ్మట్టుకొని యేలాడినాను.
ఎందుకీతల్లి యింతమంది పేనాల్ని
రక్కసి లాగొచ్చి మింగేసి పోనాది?

ఎందుకమ్మా తల్లీ ! యింత పనిసేశావు.?
ఇంతాసేసిందానివి-నన్నెందుకొగ్గేశావు?

తెల్లారి యెలుగులో - కనిపించినాళ్లతో-
ఏడుత్తూ నాగోడు సెప్పుదామనుకున్నా-

ఎలుగులో సూశాక - యేడుపులు యిన్నాక-
ఆళ్లతో పాటే యేడుత్తా కూకున్నా

సేమంగా సూత్తాడని - మమ్మల్ని కాత్తాడని-
కడుపు కూడాగట్టుకుని - దేవుడిగ్గుడి కట్టిస్తిమి.

ఏం దేవుడివి సామీ! యింతమంది పేనాల్ని
వరద మింగి పోతంటే, యేంజేస్తన్నావ్?

అనడుగుదామనుకొని - అందరం కల్సుకుని-
ఏడుత్తా యేడుత్తా గుడికాడి కెల్తే-

గుడిలేదు గిడిలేదు - మొత్త మెల్లి పోనాది-
వరదలో వరదుడే కొట్టుకెల్లి పోనాడు.

# కొండల మీద కాపురం

నీవు ఉన్నావని - మేమనుకొంటున్నామని-
నీవు అనుకోకోయ్ దేవుడు బాబూ!
నీవు ఉన్నావని మేమనుకొంటే-
పాలల్లో నీళ్లూ, బియ్యంలో రాళ్లు,
కల్తీ కల్తీ వ్యాపారాలు,
మాయ మోసాల గుడారాలు
మాకెందుకుంటాయ్?

ఏమనుకొన్నావ్? మేమేమనుకొన్నావ్?
అప్పుజేసి యెగ్గొడుతుంటాం-
దొయమన్నది దాచేస్తుంటాం-
కలిసొస్తే కాజేస్తుంటాం-
నమ్మకాలనే అమ్మేస్తుంటాం-
నీవు ఉన్నావనే మేమనుకొంటే,
ఇవన్నీ యెలా చేస్తాం?

చూస్తూ చూస్తూ చాలా చేస్తాం.
కొంపలు కూలుస్తాం-
కొంపలు కాలుస్తాం-
కొంపలు గాలిస్తాం-
కొంపలు దోచేస్తాం-

నీవు ఉన్నావనే మేమనుకొంటే,
ఇవన్నీ యెందుకు చేస్తాం?

అనుమానంగా అనుకొంటున్నాం-
మేమెకటనుకొంటున్నాం-
నీవు ఉన్నావేమో! అనుకొంటున్నాం.
ఉంటే గింటే ఒంటికి చేటని
ఆలోచించే అప్పుడప్పుడూ-
కొబ్బరికాయలు కొడుతున్నాం-
దొంగ జపం చేస్తున్నాం.

గుండెల్లో నీవు ఉంటావంటే
అది విని మేం గతుక్కుమన్నాం-
నీవే మాతో నిత్యం వుంటే,
మా పనులన్నీ చూస్తూవుంటే,
ఇంతే సంగతులనుకొన్నాం.

ఆలోచించాం - ఆలోచించాం-
గుండెల్లో నీవు ఉండకూడదని
కొండల మీదకు తోలేశాం-
నీ బతుకే బండలు చేసేశాం.

# ధర్మదేవత

ఎలాంటి దానివి, ఓ ధర్మదేవతా!
ఏమయిపోయావు కాలమహిమ చేత?
ఒకనాటి నీ జోరు ఒణుకు పుట్టించింది-
ఈనాటి నీతీరు నవ్వుకోమంటోంది-

అధర్మానికి జన్మ నిషేధించిన నీవు-
చాటు మాటుగ అది పుట్టి పెరుగునని-
రథమెక్కి తిరిగావు ఆ రోజుల్లో నీవు-
వెదకి నరికేశావు పురిటిలోనే దాన్ని.

ఏమరకుండ చూసే ఎర్రని నీ నేత్రాలు-
విరామం లేకుండ తిరిగే రథ చక్రాలు-
ఆలస్యం కాకుండ అందుకొనే రథాశ్వాలు-
అధర్మాన్ని కాల్చి, తొక్కి పాతేశాయి.

ఖర్మంకొద్దీ నీ రథం కలియుగ ప్రాంతం చేరింది-
మర్మం తెలియక ఆ రథం బురదలో కూరుకుపోయింది.
పూడిపోయాయి పూర్తిగా బురదలో చక్రాలు-
పారిపోయాయి అశ్వాలు తెంచుకొని బంధాలు.

కాలగర్భాన దాగివున్న అధర్మం-
కదల్లేని నిన్నుచూసి ధైర్యంగా పుట్టింది-
అత్యాశలకుంపటిని అందంగా రాజేసింది-
నీ మీద కసికొద్దీ-రోజులు దొర్లే కొద్దీ - రారాజైపోయింది.

నీ శత్రువు చక్రవర్తి కావడం సహించలేక-
దాన్నంతమొందించే శక్తి యుక్తులులేక-
ఏమీ చెయ్యలేక - ఎటూ కదల్లేక-
అలాగే రథంలో విగ్రహమైపోయావు.

ఈ నాడారథమేమో గుడిగా నిలబడుంది-
నీవేమో దేవుడిగా అందులో వున్నావు-
నీ ధర్మ ధ్వజమేమో ధ్వజస్థంభమయ్యింది-
నీ ఆత్మ దీపమై కొట్టు మిట్టాడుతోంది.

అధర్మం ఈనాడు ధైర్యంగా బ్రతుకుతోంది-
ప్రదక్షిణల పేరిట గుడిచుట్టూ తిరుగుతోంది-
ధ్వజస్థంభాన్ని తాను పరీక్షగా తాకుతోంది-
చేతులు జోడించి మరీ నిన్ను వెక్కిరిస్తోంది-

# ఎవరు బండ? ఎవరు దేవుడు?

అదేదో ఊరినుండి మహాశిల్పి వచ్చాడు-
మరేదో ఊరినుండి పెద్దబండ తెచ్చాడు.
ఆరడుగులు కొలతబెట్టి బండను ఖండించాడు-
మిగిలిన మూడడుగుల ముక్కను పక్కకు తోసేశాడు.
ఆరడుగుల బండేమో విగ్రహమై వెలిసింది-
మూడడుగుల ముక్క బండ చాకి రేవు చేరింది.

కంపుకంపు మనసులన్నీ దేవుని యెదట నిలిచాయి-
కంపుగొట్టే బట్టలన్నీ బండ చూట్టూ చేరాయి.

గొంతెమ్మ కోర్కెల గొంతులన్నీ తీర్థంతో తడిచాయి-
మురికి మరకల బట్టలేమో నీటిలో మునిగాయి.

అర్థంగాని స్తోత్రాలతో పూజారి భక్తి శ్రద్ధలు-
చాకలి నోటివెంట ఉస్సు ఉస్సు శబ్ధాలు.

శఠగోపం ప్రతితలనూ పవిత్రంగా తాకుతోంది-
పవిత్రతకై ప్రతి బట్టా బండను బాదుతోంది.

తుదకు-
గుడి నుండి మనసులన్నీ కంపుతోనే వెళ్లాయి-
రేవు నుండి బట్టలన్నీ ఇంపుగా వెళ్లాయి.
గుడిలోని దేవుడా! రేవులోని బండా!
ఎవరు దేవుడు? ఎవరు బండ?

# అహం బ్రహ్మాస్మి

ఎవడురా వాడు? దేవుడనబడువాడు-
ఎక్కడున్నాడు? ఎలా వున్నాడు?

బండలో తానుండబోడు-
లడ్డుండలు మింగలేడు-
పూజలేవీ అందుకోడు-
మొక్కుబడులకు మురిసిపోడు-

ఆస్తికులనాదు కోడు-
నాస్తికులతో ఆడుకోడు-
లేడు లేడు దేవుడు-
నిను వీడి వాడు లేడు.

దేవాలయంలో వెదకి చూడు-
నాదన్నది మరచి చూడు-
మనసు తెరలను తెంచిచూడు-
మమతల కవతల చూడు-
ఆశల ఆశయాల
వాసనలను తుడిచి చూడు-

చూడు - చూడు - చూడు
నాదన్నది లేని 'నేను'-
నిరంతరమూ వున్న 'నేను'-
సర్వమూ తానైన 'నేను'-

అద్వైతం అదేరా - అదే దాని తీర్పురా-
సన్యసించి అద్వైతం అంతు చూడాలనుకోకు-
మనిషిగా నీ ధర్మం యెప్పుడూ మరువకు-
నిష్కామ సేవలో బ్రతుకు గడిపి చూడు-

సంపూర్ణ మానవత్వం
సగం దైవత్వం రా-
దైవానికి ప్రతినిధివి-
భూమ్మీద నీవేరా.

# సంసారి నిత్యసంకల్పం

ధన ధాన్య వస్తు వాహనం,
భోగం, భాగ్యం, ఐశ్వర్యం,
ఉద్యోగం, ఉత్సాహం,
స్వగృహవాసం, సత్సహవాసం,
క్షేమం, ఆయురారోగ్యం,
పుత్ర పౌత్రాది జన సౌఖ్యం,
బంధుమిత్రాది జన సహాయం,
సర్వ దేవతా కటాక్షం,
ఆనందమయ జీవితం-
శుభమస్తు - జయమస్తు-
సర్వదా లభ్యమస్తు.

# జ్ఞాని సత్య సంకల్పం

కష్టం - నష్టం
సుఖం - దుఃఖం
సంతోషం - సంతాపం
అవమానం - సన్మానం
సర్వం దైవార్పితం.

సకల జీవుల అనుభూతులే నావిగా-
ఓంకారమె ప్రాణంగా-
లోక కల్యాణ వ్రతమే జీవితంగా-
భూమ్మీద నీ ప్రతినిధిగా-
బ్రతుక గోరుతున్నాను.
తగిన శక్తితో పాటు
త్రికరణ శుద్ధిని-
స్థిర చిత్త భక్తిని-
సర్వదా ప్రసాదించు భగవాన్ !

# కాలమంటారు కాలమంటారు

కాల గర్భమంటారు - కథలెన్నో చెబుతారు-

కాల మహిమంటారు - కళ్లు తేలేస్తారు-

కాల చక్రమంటారు - కదలి పోతుంటారు-

కాల దోషమంటారు - కూలదోసి పోతారు-

కాల యముడంటారు - కలవర పడతారు-

కాలం తీరిందంటారు - కన్నీరు పెడతారు-

కాలమంటారు - మంటల్లో - కాలమంటారు-

కాలమంటూ - కాలమంటూ - కాలిపోతుంటారు

కాలంలో కలిసిపోతుంటారు.

# పిలుస్తోంది పిలుస్తోంది

బాబూ! రా బాబూ!
బ్రతుకు నీకు ఇవ్వలేని శాంతి నాదగ్గరుంది.
రా బాబూ! నా బాబూ! రా బాబూ!
ఆ తల్లి కడుపున పుడతావు-
శ్రమల నలిగి పోతావు-
నాలో కలిసి నిత్యమైపోతావు.
ఈ తల్లి వొడిని ఒదిగి విశ్రమిస్తావు-
రా బాబూ! నా బాబూ! రా బాబూ!

నాదగ్గరున్నవారు చూడు-
దరిద్రానికందకుండ - దాస్యానికి దొరక్కుండ-
తీరని కోరికల మధ్య చిక్కుకొని నలక్కుండ-
పగద్వేషాల మధ్య తగుల్కొని గింజుకోక-
కడుపుకోసం అక్రమాన్ని ఆశ్రయించే ఖర్మ లేక-
కష్టమన్న మాట మరిచి-యెంతో ప్రశాంతంగా-
ఆదమరిచి వున్నారు - రా బాబూ! నా బాబూ! రా బాబూ!
నీవొలినప్పజెప్పి వెళ్ళడానికొచ్చినపుడు-
"బ్రతుకే" ఒక "మాయ"గా బోధపరచాను నీకు-
చిత్రమది చూడబోతే-మాయ బ్రతుకు చేతిలో

కీలుబొమ్మ ఔతావు-యిల్లు చేరగానే నీవు-
ఎందుకంత మతి మరుపు? ఖర్మగాకపోతే నీకు.

కులం - మతం - పేద - గొప్ప
ఆడ - మగ - చిన్న - పెద్ద
ఏ తేడా లేకుండా నేనాదరిస్తాను.
భయమెందుకు? బాధెందుకు?
పగలైనా - రేయైనా - ఎండైనా - వానైనా
మనశ్శాంతి కావాలని - వీలు కుదిరి నీవొస్తే-
పదిలంగా నా ఒడిలో పరుండబెడతాను-
నిశ్శబ్ద రాగంతో జోలపాట పాడుతాను.

ఇప్పుడప్పుడే కాదని - తప్పించుకొందామని-
పరుగెందుకు తీస్తావు? పారిపోలేవు నీవు-
రా బాబూ! నా బాబూ! మాట వినరా బాబూ!

అని - రెండు చేతులూ చాచి,
చిరునవ్వులు చిందిస్తూ,
చిరుకోపం చూపిస్తూ,
పిలుస్తోంది - పిలుస్తోంది-
వల్లకాడు - పిలుస్తోంది-

# బావా !

పెళ్లైతే భర్తని ఏమని పిలవాలని
కన్నెపిల్ల కామాక్షికి - ఒకటే ఆలోచన.

పురాణం సినిమాలు, పతివ్రతల పుస్తకాలు
స్వామీ! అని పిలవమని చెబుతుండేవి తనకు.

నాగరిక ప్రపంచం, సమానత్వపు సంవాదం
పేరుపెట్టి పిలవమని పేచీ పెడుతుండేవి.

అన్నెళ్లూ, వాళ్లమ్మ - గౌరవంగా నాన్నగార్ని
ఏవండీ! అంటుంటే - అదే ఖాయమనుకొంది

చదువుకున్న మగాడు, అందమైన సోగ్గాడు,
ఈడూ జోడైన వాడు - వరుడుగ కుదిరాడు.
వధూవరులిద్దరూ పెళ్లిపీట లెక్కారు-
వియ్యంకులిద్దరూ పక్కకు పోయారు-

తండ్రిమాట జవదాటని రామచంద్రుడు వరుడు
'కట్నం' యిస్తేనే తాళి మంత్రమన్నాడు-

తాకట్టుల తంత్రంలో తలదూర్చి పిల్ల తండ్రి
కట్టల్ని పట్టుకొచ్చి 'కట్నధార' పోశాడు-

అటు పిమ్మట కామాక్షిని - చదువుకొన్న మగాడికి,
అందమైన సోగ్గాడికి కన్యధారపోశాడు.

శోభనం నాటి రాత్రి - ఏమండీ ! అనవలసిన
కామాక్షి బాధగా - బావా! అన్నది.

ఎందుకలా అన్నదా ! అని అతనాలోచిస్తుంటే-
కన్నీళ్లు తుడుచుకొంటూ - కన్నెపిల్ల కామాక్షి-
నాకన్నా ముందు నీవు మా అక్కకి మొగుడివంది-
ఆమె పేరులక్ష్మి అంది - అదే వరకట్నమంది.

# నలుగుతోంది - నలుగుతోంది

అది అందమైన గది - శోభనం గది.
సంతోషపు ఘడియలవి - మధురాతి మధురమవి-
దాంపత్య జీవితానికి ప్రారంభ ఘడియలవి-
జీవితాన ప్రతివారూ యెదురుచూసే ఘడియలవి-

మీసంతో, వేషంతో
విర్రవీగే మగవాడికి
పరీక్షా ఘడియలవి-
పసందైన ఘడియలవి-

ఆడదాని గడుసుదనం
తొలిసారిగ మగతనానికి
తలవంచే ఘడియలవి-
మరపురాని ఘడియలవి-
వెచ్చని కౌగిట్లో పరవశించి నలుగుతోంది
ఆమె తనువులోని అణువణువు-

నాజ్యంగా నలుగుతోంది
ఒంటి మీద తెల్ల చీర-
నాజూగ్గా నలుగుతోంది
సిగలోని మల్లె దండ-
తోడుగ నలుగుతోంది
ఆనాడే కొన్న పరుపు-

ఇవన్నీ కోరుకొన్న ఆడపిల్ల తండ్రి మనసు
ఒంటరిగ నలుగుతోంది-
పెళ్ళికైన అప్పు తాను
ఎలా తీర్చాలో తెలియక-
నలుగుతోంది - నలుగుతోంది
ఆడపిల్ల - తండ్రి మనస్సు-

# షష్టిపూర్తి శోభనం

పాలగ్లాసు పట్టుకొచ్చి
పాదనమస్కారం చేస్తున్నప్పుడు,
తొలిరేయి - పార్వతి -
వెయ్యి దేవుళ్లకి మొక్కుకొంది,
కష్టాల్లో తన భర్త
కన్నీళ్లు తుడవాలని -
భర్త కౌగిలి తనకు
తల్లి ఒడి కావాలని-
పరంధామ్ ప్రేమగా
ఆమెను పైకెత్తాడు.

* * *

ముప్పైయేళ్ల అనంతరం

* * *

షష్టిపూర్తి పెళ్లి కొడుకు-
పరంధామయ్య-
పట్టెమంచం మీద
ఎదురు చూస్తున్నాడు-
పార్వతమ్మ రాకకోసం-

ముప్పైయేళ్ల కాపురంలో,
సాధించిన విజయాలు
కళ్ల ముందు నిలిచాయి-
భార్య సహకారమే లేకుంటే
ఆ విజయాలన్నీ తనకసాధ్యాలే.

— — — —

చేతిలో పాలగ్లాసుతో-
మళ్లీ వచ్చింది - పార్వతమ్మ-
సగం పండిన తలను
పూర్తిగా దించుకొని.
పరంధామయ్య లేచాడు - ఓపిగ్గా-
పాలగ్లాసు పక్కన పెట్టి
పాదాలు తాకబోయింది - మళ్లీ -
మధ్యలోనే ఆపి, ఆమెను లేవనెత్తి
పాదనమస్కారం ఆమెకు
తను చెయ్యదలిచాడు.
అందుకు సాంప్రదాయమే కాదు-
భార్య కూడా ఒప్పుకోదు - కాబట్టి-
మనసులోనే భార్యకు
ఋణ నమస్కారం చేశాడు.
అతని కృతజ్ఞతాభాష్పాలు,
ఆమె పాదాలపై రాలాయి.

# "డుపు" -లు

స్త్రీ జీవితంలో - యెక్కువగ
చోటు చేసుకొనే అక్షరాలు - "డుపు"లు
పెళ్లికి ముందు - పెద్దల జడుపులు-
మంచి భర్త దొరకాలని
వారు దేవుడికి కట్టే ముడుపులు-
వారికి జీవితాంతం మిగిలేవి యేడుపులు-
వారాశించి పొందనివి - కన్నీటి తుడుపులు-
జీవితాన వారు నేర్వాలి యెన్నో ఒడుపులు-
భర్త మరణిస్తే - తనకు మిగిలేవి తెల్లని ఉడుపులు-

# శాపగ్రస్త

నేనొక జూదగాడికి భార్యనయ్యానే-

అని బాధపడుతున్నావా, అక్కా!

నేనొక వ్యభిచారికి సతినయ్యానే-

అని విచారిస్తున్నావా, చెల్లీ !

నేనొక తాగుబోతుకి ఆలినయ్యానే-

అని రోదిస్తున్నావా, తల్లీ !

నేనొక పిసినిగొట్టుకి పెళ్లి న్నయ్యానే-

అని పరితపిస్తున్నావా, అమ్మా!

అనుమానపు మొగుడే వస్తే నీ వెంతటి శాపగ్రస్తవు!

నరకంలోని శిక్షలన్నీ పతిరూపంలో ప్రత్యక్షం కావా?!

# అందమైన అమ్మ

**(హిందీలోకి అనువదించబడి,
హిందీ పత్రికలో ప్రచురితమైనది)**

అప్పుడు-
నేనమ్మ కడుపులో వున్నప్పుడు-
అమ్మా నాన్నల మాటలన్నీ నే విన్నాను.
ముద్దొచ్చే అమ్మ నుదుటి కుంకుమ తానవ్వాలని-
పట్టుకుచ్చు లాంటి అమ్మ జడలో పూలదండ కావాలని-
ఆదరించే అమ్మ చేతుల్ని గాజులై బంధించాలని-
తెగ పొగిడేవాడు నాన్న
అబ్బ! అమ్మ అంతందమైనదా అని,
అంత అందమైన అమ్మను
ఎప్పుడు చూడడమా అని
ఆరాటపడ్డాను.
ఇప్పుడు- నేను పుట్టాను - అమ్మను చూశాను-
నిజమే - అమ్మ అందమైందే.
కానీ- నుదుటి కుంకుమ - జడలో పూదండ-
చేతులకు గాజులు అన్నీ అబద్ధాలు-
నాన్న పోయాడట-
అవన్నీ తనకిష్టమని పట్టుకుపోయాడట.

# దేవుడా! నీవు దేవుడైతే-

దేవుడా! నీవు దేవుడైతే-
మరో జన్మే ప్రసాదిస్తే-
అప్పుడూ నేనాడదైతే-
ఇంతగా శిక్షించకయ్యా
దేవుడా! నీవు దేవుడైతే-

మల్లె తీగలాంటి స్త్రీజన్మనిచ్చావు-
అల్లు కోమని మంచి ఆధారమిచ్చావు-
అంతలోనే దాన్ని కనుమరుగు చేశావు-
కుప్పగా నేల కూల్చి పారేశావు-
దేవుడా! నిజంగా నీవే దేవుడైతే,

పశువుల నోటికందక ముందే-
కాళ్ల క్రింద అది నలగక ముందే-
దారి తప్పి అది పెరగక ముందే-
నవ్వుల పాలది కాకముందే-
మనిషివై నీవొచ్చి నా మెడలో తాళికట్టు-
లేకుంటే మసిజేసి మట్టిలో పాతిపెట్టు.

సర్వేజనా సుఖినో భవంతు.. సర్వేజనా సుఖినో భవంతు.. సర్వేజనా సుఖినో భవంతు..

# అందాల పోటీలు

అందంకోసం ఆరాటాలు-అద్దం ముందు పోరాటాలు-

సర్వాంగ ప్రదర్శనల అందాల పోటీలు-యెన్నెన్నో నేడు.

చిత్ర విచిత్ర వర్ణాకృతుల పశుపక్ష్యాదుల ముందు-

రంగురంగుల పుష్పాల సౌందర్యం ముందు-

అంతంత మాత్రమే మనిషి అందచందాలు.

అయినా వారికి అంతులేని అహంకారాలు.

మనిషికి మాత్రమే స్వంతమైన సౌందర్యం ఆత్మ సౌందర్యం.

మరింతగా దాన్ని పెంచుకొంటే,

అదే వారి కందం-

లోకానికానందం.

# మంత్రగాళ్లు

ప్రపంచంలో మంత్రగాళ్లు - ఒకళ్లని మించి మరొకరు-
కపాలాల దండలు, అతి భీకర రూపాలు,
వికటాట్ట హాసాలు, చావు గావు కేకలు.
వారుచ్ఛరించే మంత్రాలు-అతి కఠిన శబ్దాలు.
పఠించి, మంత్రించి మనిషి మీద ప్రయోగిస్తే,
మంత్రగాడి చేతిలో ఎవరైనా కీలు బొమ్మే-
ఎదురులేని మంత్రగాళ్లు -
మరికొందరున్నారు-
మనతోనే వున్నారు.

పువ్వుల్లా కనిపిస్తారు-
చిరునవ్వులు కురిపిస్తారు-
మైకంలో ముంచుతారు-
బానిసల్ని చేసేస్తారు.

వారి రూపాలు సున్నితాలు-
మంత్రాలు బహు సరళాలు-
అవి - ఆ, ఊ, ఊంగా,
అత్తత్తెత - వగైరాలు.

# కోకిలమ్మ గుండెకోత

ఎందరో మహాకవులు
కవితలల్లు తున్నారు
కోకిలమ్మపాట మీద
తియ్యని తన గొంతు మీద-
కానీ,
అవతారం చాలించి
గోపాలుడు వెళ్లిపోతే,
మరచిపోయి వెళ్లాడని
దిగులు చెంది అతని మురళి,
కోకిలమ్మ రూపంలో
అతని కోసం గాలిస్తూ
ఏడుస్తూ తిరుగుతోందని
అందరికీ తెలియదాయె!
కోకిలమ్మ గుండె కోత-
కడకు కమ్మని పాటాయె.

# పాడు కాకులు

గున్నమామిడి కొమ్మమీద-మేను మరచిన కోకిలమ్మ-
గొంతువిప్పి పాడుతోంది-గున్నమామిడి ఆడుతోంది.
ఓహో ఓకోకిలమ్మా! ఆపకుండా పాడవమ్మా!
ఎంతకమ్మని గొంతునీది-యెంత తియ్యని పాట నీది-
ఖర్మమేమో-మర్మమేమో తెలియకుండ పోయెనమ్మా-
పాడు దేవుడు-కర్కశంగా, కాకి రూపం నీకిచ్చెనమ్మా!
ఏం కాకులు వెధవకాకులు - కారుకూతల పోరుగాకులు-
కావ్‌మంటూ దేబిరించే - పిండాకూడు పాడుగాకులు.

మళ్లీ గిళ్లీ - పుడితే గిడితే-
కోకిలై నే పుట్టాలమ్మా!
జగతి మొత్తం పరవశించే - కోయి పాటలు పాడాలమ్మా!
ఓహో! ఓ కోకిలమ్మా! ఆపకుండ పాడవమ్మా!
అని-చెట్టునీడన విశ్రమించిన బాటసారి మురిసిపోయాడు.
పక్కనుండి వింటున్న కాకమ్మకు ఆ పలుకులు-
గునపాలై తగిలాయి-గుండెను గుచ్చేశాయి.

ఎవరో ఈ బాటసారి!
నిజమెరుగని బాటసారి.
కోకిలై తను పుడితే-
పోరుగాకుల గూటిలో-
కారుకూతల లాలనలో-
పాడుగాకులు తినిపించే-
పిండాకూడు మెతుకులతో-
బ్రతుకు నిలుపుకోవాలని-
పెరిగి పెద్దవ్వాలని-
తెలియలేని బాటసారి-
తెలివి లేని బాటసారి.

అనుకోనీ, నవ్వుకోనీ, గున్నమామిడి మీద నుండి-
గూటికెగిరిపోయింది-కావ్‌మంటూ ఆకాకి
(బాటసారిని) కావుమంటూ పాడు (కాంటూ) కాకి.

# లోకులకు కాకులు

"లోకులు కాకులు"-"లోకులు కాకులు"
అని పలువురు కేకలు పెడుతుంటె,
ఆ కేకలు వినివిని కాకులు ఒకటై
లోకుల మీదకు ఒక లేఖను విసిరాయి.
"లోకులకు" "కాకులు" వ్రాయు లేఖ,
తాళిపెళ్లి కాదుమాది, ఎగతాళి బ్రతుకసలే కాదు-
కడదాకా కలిసి బ్రతికే అనురాగపు దాంపత్యం మాది.
తాళి కడతారు మీరు, ఆలుమగలమంటారు-
కలసి కడతేరలేక విడాకులందుకొంటారు.
మాలో గూడులేని వారు లేరు, ఒకరి గూడు కోరు కోరు-
మీలో యెందరివి సొంతయిళ్లు? మీ బ్రతుకే అద్దెకొంపలపాలు.
గుడ్లు పెట్టి కలిసి పొదిగి, పిల్లలకై పరితపిస్తాం-
ఏరుకొచ్చిన తిండిబెట్టి-మా పిల్లల్ని మేం పెంచుకొంటాం-
మీలోన మాయగాళ్లు , కడుపు జేసి పారిపోతే,
పసిగుడ్డును పారేసి-కన్నతల్లి అదే దారు.
రెక్కలొచ్చిన మా పిల్లలు, మాపై ఆధారపడరు-
స్వతంత్రంగా ఎగిరిపోయి-పౌరుషంగా బ్రతుకుతారు.
మీసమొచ్చినా పెళ్లొచ్చినా, మిమ్మొదలరు మీ పిల్లలు-

కడదాకా కన్నవారు పోషించడం'లా' అంటారు.
మాకెవరికైనా, ఎక్కడైనా తిండి కనిపిస్తే-
అందర్నీ పిలుస్తాం-అందరం కలిసి తింటాం-
మీలో కొందరు పెద్దలు పాపం! వున్నది తామే మేసేద్దామని,
తక్కిన వారిని తోలేస్తారు. అడ్డుతగిలితే చంపేస్తారు.

ఎవరు మాలో మరణించినా, అందరం చేరతాం-
పోగొట్టుకున్నందుకు-భోరుమని యేడుస్తాం.
సాటి మనిషి శవం రోడ్డు పక్కన కుళ్ళు తుంటే,
ఎందుకొచ్చిన గొడవ లెమ్మని-పక్కనుంచి పోతారు మీరు-
పైపెచ్చు పోజు పెట్టి-మానవ జన్మ మహత్తరమని,
మానవుడే దేవుడని-దెయ్యం కబుర్లు చెబుతుంటారు.

అందుకే-యికమీదట-లోకులు కాకులు అనొద్దు-
నీతిలేని మీతో-మమ్మల్ని కలపొద్దు.

ఇట్లు
పలుగాకులు

# మార్చ్

ఏ మార్చే ఓ మార్చ్!
నువ్వంటే మహాభయం!
నువ్వు వస్తున్నావంటే .....
పరీక్షల భయం-
పెళ్లి ళ్ల భయం-
అకౌంట్ల భయం-
బడ్జెట్ భయం-

మాయదారి మార్చ్!
మహమ్మారి మార్చ్!
ఫిబ్రవరిని కొరికేసి
ముందుగా వచ్చేసి,
వెళ్లిపోతూ మమ్మల్ని
ఏప్రిల్ ఫూల్స్‌ని చేసి,
జారుకొంటావు నీవు-
గింజుకొంటాము మేము-

# యవ్వనం

వేగం - వేగం - వేగం
అది వూహలకందని ఉద్వేగం-
అదే అదే యవ్వన వేగం-
విచ్చల విడితన మెచ్చినా,
చెడు చెడు చేతల చిక్కినా,
తప్పదు - తప్పదు - అవమానం-
బంగరు భవితకు అపకారం.
బుడిబుడి నడకల రోజుల్లో,
అమ్మానాన్నే ఆది గురువులు.
బడిలో చదివే ప్రాయంలో
దారి చూపేది అక్కడి గురువులు.
కన్నుగొట్టే ప్రాయం నుండి-
కాటికి పోయే నాటి దాకా-
ఎవరికి వారే గురువులు-
వారి ఖర్మకు వారే బాధ్యులు.

# అందమైన బుజ్జాయి

అమ్మ అందచందాలనూ, నాన్న మేని ఛాయనూ
పుణికి పుచ్చుకొన్న అబ్బాయొకడు పుట్టాడు-
అందమైన బుజ్జాయిగ అలరించాడందరిని-
ఎదురైన ప్రతివారి భుజాలెక్కి పోయాడు-

యవ్వనంలో అడుగుపెట్టి-విచ్చల విడిగాడయ్యాడు-
కన్నె పిల్లల యెదలో కసికసిగా మెదిలాడు-
అహంకారమదంతో అందరితో తిరిగాడు-
ఆ పరిసరాల కతడాబోతయ్యాడు-

ఈనాడా అందగాడు-వూరి బయట సత్రంలో
ఒంటరిగ వున్నాడు-యేడుస్తూ వున్నాడు-
గతంలోఅందమైన అతగాడి చేతివేళ్లు
అతని కన్నీరునే తుడవలేవు-కారణం ఇప్పుడవి లేవు.

# గోదారి ఘొల్లుమంది

ఆకతాయి అబ్బిగాళ్లకు
చెరచడమే ఆటైతే-
కన్నెగాని కసురుగాయ
గోదాట్లో దూకేస్తే-

మూడు పదులు దాటినా,
కాసులంటే ఆశలేని
పెళ్లికొడుకు రాకపోతే,
ఈసురోమని యింట్లో
కుండలేని ఓ అమ్మి-
చీకట్లో నడిచొచ్చి
గోదాట్లో దూకేస్తే-

ఇంటికి పెద్దకొడుకు-
ఆకలి రొక్షసుడ్ని
ఇంట్లోంచి తరమ లేక,
ఇంటి గడప తొక్కలేక
గోదాట్లో దూకేస్తే-

తాళిగట్టిన మగడు
తాగి లాగి తంతుంటే-
తన రక్తాన్ని అత్తగారు

చెంబుల్తో తాగుతుంటే-
విసుగెత్తి యిల్లాలు
గోదాట్లో దూకేస్తే-

పిల్ల ల చదువులకు-
పెళ్లి పెటాకులకు-
డబ్బులిచ్చిన అప్పులాళ్లు
మీదబడి బకిరేస్తే-
దారిలేక అప్పులయ్య
గోదాట్లో దూకేస్తే-

రాజకీయాల్లో నో-ఆస్తిపాస్తులగ్గానో-
అడ్డొస్తున్నారనో-సాక్ష్యం చెబుతారనో
మనుష్యుల్ని చంపేసి గోదాట్లో తోసేస్తే

ఒడిబట్టిన పాపానికి గోదారి ఘొల్లు మంది-
ఎర్రని కన్నీటితో బుస్సుమని లేచింది-
కసిదీరా వాళ్లన్నీ కడిగిపారేసింది.

# మౌనసాక్షి

ఇచ్చి చంపడమెందుకిలా మమ్మల్ని-
ఎన్నాళ్లు మేమిలా ప్రతిక్షణం చావాలి?

కాళ్లెందుకిచ్చావు కనికరించి మాకు?
ఇంటింటి కుక్కలూ తరిమి కరవాలనా!

చేతులెందుకిచ్చావు బారెడేసి మాకు?
బ్రతుకుతెరువులేక తల బాదుకోమనా!

కళ్లెందుకిచ్చావు కనికరించి మాకు?
తనవారి పస్తుల్ని చూసి యేడవమనా!

ముక్కెందుకిచ్చావు ముచ్చటగ మాకు?
ఎంగిలాకుల వునికి పసిగట్టుకోమనా!

కడుపెందుకిచ్చావు కసికొద్దీ మాకు?
ఆకలిని అందులో దాచుకోమనా!
కిడ్నీలు రెండేసి మాకెందుకిచ్చావు?
అవసరాల కొకటి అమ్ముకోమనా!
అని నిర్భాగ్యులందరూ నిలదీసి అడిగితే,
అదిరిపోయి-బెదిరిపోయి పాలిపోడు దేవుడు-
అలాగని వారిగోడు పట్టించుకోడువాడు-
చిరునవ్వు మోముతో చూస్తూనే వుంటాడు.

# హక్కులు

ఆకలి పస్తులు యెందరికో!
పస్తుల ఆకలి మరెందరికో!
ఆకలికాలం ఓరన్నా!
ఇది కలికాలం రా అన్నా!
అడగకపోతే అమ్మైనా
అన్నం పెట్టదు ఒట్టన్నా!

కూడు-గుడ్డ-యిల్లు -వాకిలి
నీకున్నా - లేకున్నా-
అందరిలాంటి మనిషివిరా!
హక్కుల సేనకు మహరాజువిరా!
హక్కుల సంగతి మరచావంటే-
బిక్కు బిక్కు మని - నిలిచావంటే-
దోపిడి దొంగల యాగంలో
బలి పశువుగ నీవు మారేవు-
వెచ్చటి నెత్తుటి మడుగుల్లో
ఆఖరి స్నానం చేసేవు-

# అర్హత

రాజకీయ విద్యాలయంలో,

ఐదు వరకే అసలు విద్య

ప్లస్ టూ అంటే అర్థబలం-

పి.జి. అంటే అంగబలం-

అందితే జుట్టు, లేకుంటే కాళ్లు

అనేదే ఆదర్శంగా, ఆత్మవంచన అనుకోకుండ

జుట్లు విడగొట్టే జుట్లు ముడివేసే

కోర్సులన్నీ పాసయితేనే,

సి.యం. ఐనా పి.యం. ఐనా.

# ఎన్నిక

మనిసిచ్చే ముందు - మనువాడే ముందు-
తెలివిగా వుండాలి - ఓ ముద్దుగుమ్మా!
రంగులు గుర్తించాలి - మురిపాల రెమ్మా!
నీకంటికి నచ్చినట్టి అందాల నాయకుడు
నీ మనసు తనవైపు తిప్పేసుకొంటాడు.
మూడుముళ్లూ పడిపోతే - వాడే మొగుడైపోతే-
అటుపై నీఖర్మం - వాడి దయ, నీ ప్రాప్తం.
భర్తగా నువ్వతన్ని ఎంచుకొన్న పాపానికి
యావజ్జీవ శిక్ష నీవనుభవించాలి.

అలాగే ప్రజలారా!
ఎన్నికలముందు - ఓటేసే ముందు-
తెలివిగా వుండాలి - మరిచిపోకండి-
మీయింటికి ఒచ్చినట్టి ఆ ప్రజానాయకుడు
మీ మనసు తనవైపు తిప్పేసుకొంటాడు.
ముద్రకాస్తా పడిపోతే - అతడే పాలకుడై పోతే-
అటుపై మీఖర్మం-అతని దయ, మీ ప్రాప్తం.
పాలకునిగా మీరతన్ని యెన్నుకొన్న నేరానికి
ఐదేళ్ల కఠిన శిక్ష మీరనుభవించాలి.

# లడ్డుండల పొట్లం

లడ్డుండల పొట్లం వంటింట్లో వుంది
తెందర్గా తిందాం-అంది ఓ యిల్లాలు.
నే తెస్తా-నేతెస్తా-అంటూ వెళ్లిన పిల్లలు
ఎంతకీ రాలేదు-ఏడుపులు వినబడ్డాయి.
నేనే తేవాలి - నేనే తేవాలి-
అని కొట్టు కొంటున్నారు-
జుట్లు పట్టుకొంటున్నారు-
పొట్లాన్ని పట్టుకొని చిదిమేస్తున్నారు-

ప్రతి దానికీ యిదేవరస-
వేగలేక చస్తున్నాను-
ఎంతని మొత్తుకోను?
తగిలించండి నాలుగు-
అంది యిల్లాలు ఒళ్లు మండి.

బదులుగ మగడు ఓ నవ్వు నవ్వాడు.
ఎందుకా నవ్వు మీకు? అందావిడ రెచ్చిపోయి.
మేమే - మేమే-
మేమే యీ దేశాన్ని ఉద్ధరించాలంటూ-

పార్టీల పేరుతో పోటీలు పడుతూ-
ఎన్నికల పేరుతో కుస్తీలు పడుతూ-
స్ట్రాటజీల పేరుతో ట్రాజడీలు సృష్టిస్తూ-
దేశక్షేమం మరిచిపోయి-

అచ్చంగా - వీళ్లలా -కొట్లాడు కొంటున్న
పార్టీలు గుర్తొచ్చి నవ్వాను దేవి! అన్నాడు.

# సైనికుడు సామాన్యుడు

ఆచీకట్లో - కనిపించని గోతుల్లో -
పొంచివున్న సైనికుడి చేతుల్లో -
బైనెట్ల తుపాకుల్లో - గుళ్ళు.
మెలకువగా చూస్తున్న సైనికుడి కళ్ళు.

ఆక్షణాలు - బహుశ - అతనికి ఆఖరి క్షణాలు.
క్షణమొక యుగంగా అతని నిరీక్షణ.
ఆక్షణంలో - అతని అణువణువులో-
భయం - భయం

శతృ విమానాలు కురిపించే బాంబులకు-
తుపాకుల గుళ్లకు - బైనెట్ల పోట్లకు-
శరీరం తూట్లు పడిపోతుందని-
రక్తం విరజిమ్ముతుందని-

ప్రాణం యెగిరి పోతుందని-
అని కాదు - అతని భయం.

అవినీతి - అక్రమం - అన్యాయం - అధర్మం
కత్తులైన బోనులో - అనుక్షణం గాయపడుతూ-
నరకయాతనను భవిస్తూ-బ్రతుక్కోసం జీవితాంతం
ఓడుతూ-పోరాడే-సామాన్యుడ్ని తలుచుకొని.

సరిహద్దుల్లో యుద్ధం చేసే సైనికుడు భయపడ్డాడు.
తను కాపాడేది దేశాన్నా?
దేశంలోని మోసాన్నా?
అని తుపాకి పక్కన పెట్టి
యోచిస్తూ కూర్చున్నాడు.

# సైనికులు జర్నలిస్టులు

సరిహద్దుల్లో - దురాక్రమణలను
అరి కట్టేది - సైనికులు.
సంఘంలోని దురాగతాలను
ఎండగట్టేది - జర్నలిస్టులు.
దేశ సంపదను రక్షించేది - సైనికులు.
దేశ సంస్కృతిని సంరక్షించేది - జర్నలిస్టులు.
సైనికులది దేశభక్తి నినాదం-
జర్నలిస్టులది మానవతా వాదం-
సైనికాధికారులు - విదేశాలకమ్ముడైపోతే,
సైనికులు దేశాన్ని దక్కించుకోలేరు-
పత్రికాధిపతులు - స్వార్థానికి లొంగిపోతే,
జర్నలిస్టులు సంఘాన్ని సరిదిద్దలేరు-

# తిరుగుబాటు

తిరుగుబాటు రావాలి-

తిరగబడి తీరాలి-

మానవుడు బ్రతకాలి-

మరింత యెదగాలి-

స్వార్థపు దండయాత్రలో-

ఈర్ష్యాద్వేషాల సేన-

మానవుణ్ణి హింసిస్తే-

ఎంతకాలం ఆగాలి?

ఇదెంతకాలం సాగాలి?

అందుకే - తిరుగుబాటు రావాలి-

తిరగబడి తీరాలి-

వివేకపు విచ్చుకత్తులతో,

విజ్ఞానపు గొడ్డళ్ళతో,

తెలివితేటల తుపాకులతో,

సంస్కారపు సమ్మెట్లతో-
ఎదుర్కోవాలి - ఎదురు నిలవాలి-
విప్లవ నినాదాలు అణువణువునా పలకాలి-
మనలో మూర్ఛిల్లిన మానవుడు లేచి నిలబడాలి.
అందుకే తిరుగుబాటు రావాలి-
తిరగబడి తీరాలి-

ఇంతటి యీ తిరుగుబాటు
దేశంలో కాదు బాబూ!
దేహంలో రావాలి.
మనలో తిరుగుబాటు రావాలి-
మనపై - మనమే - తిరగబడి తీరాలి-
మనలోని మానవుడు
బ్రతకాలి - పెరగాలి - ఎదగాలి.

# అగ్నిస్నానం

సంఘానికి పనికిరాని - సాయానికి అందిరాని-
పాడుబ్రతుకు నీదైతే - అది పాదిబట్టి పాపైతే-
ఆలసించి, పాపాన్ని కూడగట్టు కోవద్దు-
యోచిస్తూ, కాలాన్ని కరగదీసుకోవద్దు-

పశ్చాత్తాపాగ్ని శిఖలు
హృదయంలో రగుల్కొలిపి
ఆత్మనాహుతి చేసుకో-

అగ్నిస్నానం చేసికూడా
ఆత్మశుద్ధి కాకపోతే
ఆత్మహత్య చేసుకో

# ఎవరు

మనిషిని చేసే చదువే నిన్ను వింత జంతువుగ మారుస్తుంటే-
మనుషులనేలే పదవే నిన్ను మనుషులనే తినమంటుంటే-
ఆ చదువును చరిచే దెవరు? ఈ పదవిని తుడిచే దెవరు?

నీతికి - నిజాయితీకి నిలువ నీడ లేకపోతే-
బ్రతుకు తెరువు దూరమైతే - ఆ దారిన నడిచే దెవరు?

అవినీతి - అక్రమాలు అందలా లెక్కిస్తుంటే-
ఐశ్వర్యాలందిస్తుంటే - యీ దారిని విడిచేదెవరు?

# బుఫే డిన్నర్

ఎవరివోయ్ నీవు-
అక్కడుండి పోయావ్ ?
ఎవరిక్కావలసింది వాళ్లు
వడ్డించుకు తింటుంటే,
విస్తళ్ల కోసం చూస్తున్నావా ?
బంతి భోజనమనుకొన్నావా ?

ఓరి పిచ్చోడా!
అయిపోయిందోయ్ యీదేశం
ఒక బుఫే డిన్నర్ టేబుల్-
ఎంగిలి మంగలమనుకోకుండా-
ఎగబడి - కలబడి - అందినవన్నీ-
పీకలదాకా మెక్కేస్తుంటే-
విస్తుపోయి చూస్తున్నావా ?

లేక-
దేశమాత దేహాందాల్చి-
పాలిస్తానని స్తనమందిస్తే-
తలకోముక్కా కొరుక్కు తినేసే
అసుర సంతానమనుకున్నావా!

# ఈరోజు

నిన్న మీద విసుగుతో-
రేపు మీద ఆశతో-
ఈరోజుని ప్రతిరోజూ-
గబగబా గడుపుతున్నాం.

జరిగిన రోజులకు
మిగిలిన రోజులకు
మధ్యలో నిలబడి
కృషినీ, అదృష్టాన్నీ
కలబోసి - వడబోసి
రేపు మీద ఆశతో
ఈ రోజుని ప్రతిరోజూ
గబగబా గడుపుతున్నాం.

రేపటి భవనానికి
ఈ రోజే పునాదని-
తెలుసుకోక మసలుతున్నాం.

# నేతిబీర

ప్రగతెప్పుడొస్తుంది ? ప్రగతెప్పుడొస్తుంది ?
ప్రతివాడికీ, మంచి బ్రతుకెప్పు డొస్తుంది ?

మనిషిలో సభ్యత
మనసులో మమత
సంఘంలో సమత
జాతిలో ఘనత

పందిరంతా పాకిన నేతిబీర పాదైతే,
ప్రగతెప్పుడొస్తుంది? ప్రగతెప్పుడొస్తుంది?

# గెలుపెవరిది

స్వతంత్ర మొచ్చింది - స్వతంత్ర మొచ్చింది
శ్వేతనాగు పడగ నీడ పటాపంచలయ్యింది.

మింటికెగసి మేఘమైన భరతజాతి త్యాగధార-
ఆనాడు-అర్థరాత్రి-పూలవానైకురిసింది-
భరతమాత నుదిటిపైన త్రివర్ణం తిలకమద్దింది-
జయ భారతి హృదయంలో - సిరి వెన్నెల విరిసింది.

రక్తపాత సమరాన్ని సహించలేని వారమై-
ఆయుధాలు పట్టకనే - కత్తులు కోయకనే-
శాంతిసేన సభ్యులమై - సాధించాం స్వతంత్రం-
స్వతంత్ర సాధనలో స్థాపించాం కొత్త పథం.

అటువంటి మనం - అభ్యుదయం మరిచిపోయి-
కొట్టుకు చస్తున్నాం - పొడుచుకు చస్తున్నాం-
కాల్చుకు చస్తున్నాం - బాంబులు పేల్చుకు చస్తున్నాం-
చావులు చూస్తున్నాం - చూడలేక చస్తున్నాం.

యోచిస్తే మనకిది అర్థంకాని స్వతంత్రం-
ఇదంతా చూస్తుంటే నాకో సందేహం!
వీడిన తెల్ల వాడు ఓడి గెలిచాడా!

# నిశ్శబ్దం

చైతన్యం, ప్రగతి పథం, సమ సమాజం
ఇవన్నీ, గొంతుకల్ని చీల్చుకొంటూ
బయటికొచ్చే బడా(యి) ధ్వనులు.

'ఆక'లన్న మాట మాత్రం-
గుండెమంట పంచుకొని-
గొంతుక గుమ్మంలోనే
నీరసించే నిశ్శబ్ద ప్రతిధ్వని.

# నీతిమంతుడు

నీతిమంతుడు నిద్రపోతూ - రంగు రంగుల కలగంటే-
కలలో ఒక చక్కని రూపం - తనతో యేదో చెబుతోంది.

జాతిలేని దాన్ని నేను - నీతి కూడా నాకు లేదు.
ప్రతివాడూ నన్ను జూసి ఎగబడుతున్నాడని,
నన్ను పొందగోరి వాడు పోటీ పడుతున్నాడని,
నీవు కూడా నన్ను చూసి నోరెందుకు తెరుస్తావు ?
వద్దు - వద్దు - ఆశ వద్దు - నీవందుకు పనికి రావు.

నాకోసం - గడ్డితినే సామర్థ్యం లేదు నీకు-
నంగినంగి మాటలతో నయవంచన చెయ్యలేవు-
స్నేహితుల్ని ముంచలేవు - దేశాన్ని దోచలేవు-
నాకోసం, నీవేం చెయ్యగలవోయ్? అంటే,
రెక్కలుముక్కలు చేసికొంటానంటావు-
ఆ మాత్రానికే నీకు - అప్పుడప్పుడూ

కనిపించి వెళతాను అర్థం చేసుకోనన్ను-
నీతిగా బ్రతకాలని ప్రాకులాడే వాడికి,
కనుచూపు మేరలో నిలబడుంటాను-
జాలిగా వాడికేసి చూస్తూనే వుంటాను-
ఎప్పుడో నీ నీతి నిన్నుద్ధరిస్తుందని-
కలగంటూ పడుకోరా కలియుగాంతం వరకు.

అంటూ ఆ రూపం మాయమయి పోయింది-
నీతి మంతునికది ధనరూపమని తెలిసింది-
నీతి కీనాటి పేరు అసమర్థతని తోచింది-
అంతలోనే మళ్లీ  అదే మంచిదనిపించింది.

# ఆనాడు యీనాడు

రామరాజ్య వైభవాన్ని-
ఆనాటి ప్రాభవాన్ని-
విద్యార్థిగ విన్నప్పుడు,
ఆలస్యంగా పుట్టానే-
చూడలేక పోయానే-
అనెంతగానో కుమిలిపోయాను - ఆనాడు.

నేటి వాగ్దానాల వైభవాన్ని-
మన జాతి ప్రాభవాన్ని-
కళ్లారా చూస్తూ-
ముందర పుట్టేశానే ! అని,
మరింతగా నలిగిపోతున్నాను - యీనాడు.

# ' కలి '

సత్య ధర్మములు, నీతి న్యాయములు
నాల్గు పాదములు రామరాజ్యాన-
విద్యా వైద్యములు, న్యాయ రక్షణలు
బూజు పట్టినవి నేడు దేశాన.

కలియుగ ధర్మానికి - ఒకటే పాదం-
దాని పవిత్రనామం - లంచగొండితనం.

# లోక కల్యాణం

లోక కల్యాణం - లోక కల్యాణం -
అనాదిగ వింటున్నాం యీ మాట మనం.
ఈ కల్యాణంలో వరుడెవరు?
వధువెవరు? వియ్యంకులెవరు?
ఈ కల్యాణం జరుగుతుందా? జరగదా?
వరుడికి - వధువు నచ్చలేదా!
వధువుకి - వరుడు నచ్చలేదా!
వియ్యంకులకే యిష్టం లేదా!
ఇవన్నీ కాకపోతే - కొంపదీసి-
లోక కల్యాణానికి కూడా
"కట్నం" గొడవొచ్చిందా?!
ఏమిటేమిటి? లోక కల్యాణం అంటే
మనుషుల పెళ్లి లాంటిది కాదా!
మానవాళికి మంచి జరగడమా!
పోనీ అదైనా ఎప్పుడు?
దానికీ ముహూర్తముందా!
ఉంటే, ఏ పంచాంగంలో వుందో!

# వెట్టి చాకిరీ

చాకిరీ - చాకిరీ
బ్రతుకంతా చాకిరీ-
బర్తిచాకిరీ - వెట్టి చాకిరీ-

కాదంటే కామందుని
తనదంటూ యేముందని-
అదే పనిగ యోచించి,
బరువెక్కిన హృదయంతో
బలంగా ఒక్కసారి-
గాలి పీల్చుకోబోయి-
అదీ తనది కాదేమో!
అని, భయంతో ఆగిపోతే,

అనుమానం తీరకముందే
తనువు వాలి పోయింది-
కొలువు తీరి పోయింది-

# రచ్చబండ

చెట్టు క్రిందొక రచ్చబండ - బండమీదొక పెద్దమనిషి-
అతనిచుట్టూ అమాయకులు - కొందరతనికి సహాయకులు.

మంత్రిగారు మా బావగారు - కలక్టరు నాకన్నదమ్ముడు-
మాజిస్ట్రేటు నా క్లాసుమేటు - ఐ.జి. నా వియ్యంకుడు-
నేననుకొంటే అరక్షణం - ఉద్యోగాలు, ట్రాన్స్ఫర్లు,
ప్రమోషన్లు ఒకటేమిటి - అలా జరిగి పోవాలి-
పెద్దమనిషి చెప్పుకొన్న గొప్పదనాల పట్టీ-
అందుకు సహాయకుల కట్టుకథల బట్టీ-
గుమ్మానికి తోరణంలా ప్రతియింటా ఓ సమస్య-

అంతే-
సహాయకుల సిఫార్సులతో
అమాయకుల ముడుపు మూటలు-
పెద్దమనిషి పెదవులపై నంగినంగి నవ్వులు-
అమాయకుల కళ్ళ లో ఆశల చిరు మొగ్గలు-
పెద్దమనిషి బ్రతుకు తెరువు
రచ్చబండ తెలుసు కొంది-
తన "బండ బ్రతుకే" మేలని-
విరగబడి నవ్వుకొంది.

# యావజ్జీవ శిక్ష

ఏమిటో ఆ శిక్ష నాకర్థం కాలేదు-
నేరమెవరు చేశారో అసలర్థం కాలేదు-

కనుచూపు లేదేమో! అనిపించే చీకట్లో -
కాలు కదపడానికి, చెయ్యి చాచడానికి
వీలులేని పరిధిలో-
శ్వాసించే అధికారం నీకెక్కడిదన్నట్లు
ఊపిరాడని ఆగదిలో, శిక్ష నాకు వేశారు-
ఎందుకీ శిక్ష నాకు? నేజేసిన తప్పేమిటి?

ఉలుకూ పలుకూ లేక - తిండీతిప్పలు లేక-
వెలుగుగాని - గాలిగాని - చేరలేని ఆగదిలో-
ఎందుకలా వున్నానో నాకర్థం కాలేదు-
రోజుల వ్యవహారంకాదది కొన్ని నెలల కఠిన శిక్ష.

ఉన్నట్టుండొకనాడు ఎవరిదో గట్టికేకొల్లు
దగ్గర్లో వినబడింది - రమ్మంటూ పిలిచినట్లు
నాకది అనిపించింది-
అంతలో ఏదో శక్తి ననుగెంటుకు పోతోంది-
తలక్రిందులు చేసి మరీ తోసుకు పోతోంది-
ఈ చిన్నఖైదులోంచి మరో పెద్ద ఖైదులోకి
అది తీసుకుపోతోందని నాకేం తెలుసునప్పుడు!

కేక ఒకటి విన్నాను - భూమ్మీదపడ్డాను-
కళ్లు తెరిచి చూడలేక సొమ్మసిల్లి పోయాను-
అంతలో మంత్రసాని చన్నీళ్లు చల్లింది-
కెవ్వుమంటూ నేను యేడ్పు మొదలెట్టాను-
కొన్నేళ్లకు తెలిసింది యావజ్జీవ శిక్ష
అందరితోపాటు నేనక్కడనుభవించాలని.

# సృష్టి ఎంత విచిత్రం!

మునగచెట్టును చుట్టు ముట్టి
పైకి పాకిన గుమ్మడి పాదు,
పాదునిండా గుమ్మడి కాయలు.
అబ్బ! సృష్టి ఎంత విచిత్రం!

సామాన్యుడి మెడచుట్టూ
అప్పుల పాదు,
నడ్డివిరిగే వడ్డీలు.
అబ్బ! పేదరికం ఎంత భయంకరం!

ముళ్ల ముళ్ల మొక్కమీద
లేతరేకుల గులాబీ,
గుభాళింపుల గులాబీ.
అబ్బ! సృష్టి యెంత విచిత్రం!

ఒంటి స్తంభం మేడమీద
కట్టుదిట్టాల ముళ్ల మీద
రంభలాంటి రాకుమారి.
అబ్బ! రాచరికం ఎంత కష్టం

బ్రతుకంతా నీళ్ల పాలు,
పగలంతా నిద్రపాలు
కొలనులో కలువ పువ్వు.
అబ్బ! సృష్టి ఎంత విచిత్రం!

త్రాగుడులో తేలిపోతూ,
బ్రతుకంతా మత్తులోనే
గడిపేసే త్రాగుబోతు.
అబ్బ! వ్యసనమెంత దరిద్రం!

గరగర మన్నా,
పీచుపీచుగవున్నా
పనసతొన పసందు.
అబ్బ! సృష్టి ఎంత విచిత్రం!

బరువులు మోసినా,
బాధలు పడినా,
బ్రతుకుపంట సాధిస్తే-
అబ్బ! జీవితం ఎంత మధురం!

# మదర్ థెరిస్సా

సేవాత్యాగములు ఘనీభవించిన మూర్తి-
తరతరాలకు లభించిన సజీవ స్ఫూర్తి - అమ్మ థెరిస్సా!
ఆమెను ఒడిన చేర్చుకొన్న భాగ్యవతి - భారతి.
దుఃఖాశ్రువుల మాటలు కొట్టుకుపోగా
పడుతున్నానమ్మా నీకీ అక్షర హారతి!

అవతార పురుషులకు
అలవాటుపడిన యీవేద భూమిలో-
కలియుగావతార స్త్రీమూర్తి - అమ్మ థెరిస్సా!

కలకత్తా నగరంలో
ప్రకృతి పన్నీటి జల్లులో
పరమపావని మహాప్రస్థానం!-
శ్వేత కపోత రూపంలో
పరమాత్మ దర్శనం!
13-9-1997
అలసిన అమ్మ తనువు
పుడమితల్లి గర్భంలో
విశ్రమించిన రోజు-

మతాలన్నీ మానవతముందు
మోకరిల్లిన మహోత్తరమైన రోజు-

# కాలుష్యం

వానరుడు - నరుడయ్యాడో-
నరుడు - నరుడుగానే పుట్టాడో-
చతుష్పాద జంతువు తానుకాదని,
కాళ్లు నడకకు, చేతులు చేతలకని యెరిగి,
నడకను నాగరికత వైపు నడిపించాడు.
మేధస్సుకి సానబెట్టాడు-
పంచభూతాల్ని పరీక్షించాడు-
ఫలితాన్ని-మతంగా, వేదాంతంగా, విజ్ఞానంగా విభజించాడు.
వాడు - రెండు శతాబ్దాల క్రితం
ఆధునిక యుగంలోకి అడుగుపెట్టాడు.
యంత్ర నిర్మాణం వైపు దృష్టి సారించాడు-
ప్రపంచాన్ని యంత్రాలలో నియంత్రించాడు-
లక్షల సంవత్సరాల కృషితో-
ఆర్జించిన అఖండ జ్ఞానంతో-
ఏభయ్యేళ్ల అతి స్వల్పకాలంలో,
సర్వస్వాన్నీ కలుషితం చేసేశాడు.
భూమి కలుషితం - నీరు కలుషితం
గాలి కలుషితం అయిపోయాయి నేడు.
నూతన సహస్రాబ్దిలో - పర్యావరణానికి ప్రాణం పోస్తాడని-
ప్రాణికోటి మనుగడకు హామీయిస్తాడని - ఆశిద్దాం.

# గ్రహాంతర వాసులారా దండెత్తి రండి.

ప్రతి మతంలో మనం
కులాలెంచు కొంటుంటాం-
కించపరచు కొంటుంటాం-
మతాంతరులెవరైనా
మాటమీరి వర్తిస్తే-
అందరం యేకమై
కత్తులతో కలబడతాం.

మన దేశంలో మనం
కొట్లాడుకొంటుంటాం-
పోట్లాడుకొంటుంటాం-
పక్క దేశమేదైనా
హద్దుమీరినట్లైతే-
దేశ భక్తులమై మనం
దేనికైనా నిలబడతాం.

ప్రపంచయుద్ధం - మూడోది - రాకముందే,
భూమి బూడిద కాకముందే-
గ్రహాంతర వాసులారా! దండెత్తి రండి-
భూగోళం అదిరేలా రణభేరి మ్రోగించండి-

అప్పుడే మా దేశాలన్నీ
భాయీ - బ్రదర్ అనుకొంటాయి-
హెచ్చుతగ్గులు పక్కనబెట్టి
కలిసి మెలిసి మసలుతాయి-
గ్రహాంతర వాసులారా!
దండెత్తిరండి - దయచేసి రండి.

# సిగ్గుచేటు

అనంత జీవరాసుల్లో,
మానవ జన్మ మహోత్కృష్టం !
అని వేదాలు చెప్తుంటే,
గర్వంతో మురిసిపోయాను
నాదీ ఆ జన్మేనని-

'బానిసత్వం' వ్యవస్థనీ,
'అంటరానితనం' ఆచారాన్నీ
చరిత్ర పుస్తకాలు వివరిస్తే
బిక్కచచ్చి పోయాను-
నాదీ ఆజన్మేనే అని.

# మానవుడు

నేను-జంతువులతోపాటు, అరణ్యాలలో పెరిగిన వాడిని.

మృగాలకు సాటిగా, పచ్చిమాంసం తినిన వాడిని.

పనిముట్లూ, ఆయుధాలకు రూపమిచ్చిన వాడిని.

అగ్ని పుట్టుకను హస్తగతం చేసికొన్న వాడిని.

లోహముల తీరుతెన్నులు తెలుసుకొన్న వాడిని.

ఘన, ద్రవ, వాయువులను పసిగట్టిన వాడిని.

పుడమిపై - జీవరాశిని శాశింపగలిగిన వాడిని.

మింటికెగసి చంద్రునిపై కాలుమోపిన వాడిని.

నా పేరు - మానవుడు.

నేననంతాయుష్మంతుడను.

నాలక్ష్యం - ఆస్తులు, అంతస్థులు కావు-

జ్ఞాన, విజ్ఞాన, సముపార్జన.

నాగమ్యం - కీర్తి శిఖరాలు కావు-

వసుధైక కుటుంబ సంస్థాపన.

## పాఠకులకు విజ్ఞప్తి

కవితా సుదర్శనం, అంతరంగ మథనం

ఈ రెండు పుస్తకాలను సమీక్షించి వ్రాసి మాకు పంపండి. తదుపరి ముద్రణలో వాటిని ఓ పుస్తకంగా అనుబంధిస్తాం. భావి సమీక్షకులకు అది ఉపయుక్తమౌతుంది.

ఇట్లు
కృతజ్ఞతలతో
**టి. నాగేంద్రకుమార్**
పబ్లిషర్